## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035441

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

# సర్వేశ్వరశతకము.

ఇది

భగవద్భక్తులకత్యంతోపయుక్తంబగునటుల

చేబ్రోలుగ్రామనివాసులును

అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారికిఁ బుత్రులునగు

రంగశాయికవిగారిచే

రచింపఁబడి



పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1913.

వెల రు 0-2-0 లు.

# సర్వేశ్వరశతకము.

## ధ్యానము.

శ్రీమత్సర్వజగత్తులందుఁ బరిపూర్తిన్ నిండి నైజప్రభా
సోమార్కప్రముఖగ్రహంబులఁ గడున్ శోభిల్లఁగాఁ జేయుచున్
వ్యామోహంబుల నేమియుం గనక సర్వాంతస్థచిచ్ఛక్తి వీ
వై మేల్గూర్చుచు నున్ననిన్ను మదిలో ధ్యానింతు సర్వేశ్వరా.

మ. శివుఁ డంచున్ మది నెంచి కొందఱుజనుల్ సేవించువా రైరి వి
ష్ణు వటంచున్ నిను నమ్మి కొందఱునరుల్ స్తోత్రంబు గావింతురా
ర్యవరుల్ గొందఱు నిన్ను నెంతురు పరబ్రహ్మంబ వంచున్ సమ
స్తవిశేషంబులు నీవె యౌదు వనుచున్ శ్లాఘింతు సర్వేశ్వరా. 2

శా. నీ కొక్కండును వైరి లేఁడు సఖుఁడు న్వేరొండు లేకుండెఁగా
లోకంబం దొకచోట నుండుటయు నాలోచింప నీ వొక్కచో
లేకుంటన్ విన లేదు సర్వమును నీలీలం దగెన్ గాన ని
న్నేకాలంబునఁ గొల్తు నన్నుఁ గృపతో నీక్షింపు సర్వేశ్వరా. 3

శా. మానాచ్ఛాదనముం బొనర్చుటకు సంభావింప జీర్ణాంబరం
బైనన్ జాలు వసింపఁ బర్ణసదనం బైనన్ సుయోగ్యం బగున్
గానన్ రమ్యపటంబులున్ సురుచిరాగారంబు లిం కేల నీ
ధ్యానంబే రచియింపుచున్ నిరతమున్ హర్షింతు సర్వేశ్వరా. 4

మ. పశుసంరక్షణ మాచరించుటకు గోపాలుండ వై వానిక
ర్కశబాధల్ దొలఁగించి బ్రోచితివి నీరక్షావిధం బెట్టిదో

దశకంఠాదుల సంహరించి దివిషద్వ్రాతంబుఁ గాపాడి తా
ర్త శరణ్యుండవు నీవు గాన నిను నారాధింతు సర్వేశ్వరా.

మ. భగవద్గీతలు నీమహామహిమనే వాలాయమున్ జెప్పెడున్
దగ మీమాంసయు మున్నుగాఁగలుగుశాస్త్రంబుల్ భవత్తత్త్వమే
పొగడున్ మంత్రములుం దపంబులు జపంబుల్ నీప్రభావంబుచే
నెగడున్ గావున నిన్ను నమ్మి కొలుతున్ నిత్యంబుసర్వేశ్వరా. 6

మ. తలఁపన్ దారువులందు సగ్నివలె నంతర్యామివై సర్వదే
హులయందున్ నివసించుచుంటివి మనుష్యుల్ మూఢు లావారునిన్
దెలియన్ జాలరు జ్ఞానియొక్కఁడె యెఱుఁగున్ నీతత్త్వమున్ జిత్తని
శ్చలుఁడై నీమననం బొనర్చుకతనన్ సర్వజ్ఞ సర్వేశ్వరా. 7

## స్తోత్రము.

శా. మాయారూపముతోడ మేఘములు నీమాహాత్మ్యమున్ దెల్పు
దోయంబుల్ వెదజల్లుచున్ సకలజంతుశ్రేణికిన్ జీవనం [చున్
స్థాయిత్వం బొనగూర్చుచుండె నహహా! సర్వప్రపంచంబు నీ
వే మైయుంటివి నిన్నెఱుంగఁగ వశంబే మాకు సర్వేశ్వరా. 8

మ. నిగమంబుల్ మఱి యాగమప్రకరముల్ నిన్ జేర్పఁగాసంజాలకే
మగిడెన్ గావున నేరు జాలరు భవన్మాహాత్మ్యమున్ దెల్పఁగన్ ·
జగముల్ నీవె సృజింపఁ జెంపఁగను నాశంబొనర్ప శక్తుండ వె
ట్లుగ నిన్నుం దెలియంగ నేర్తు నను మూఢుంబ్రోవు సర్వేశ్వరా. 9

మ. తరుజాలంబులకున్ సుమావళులచేతన్ బల్లవస్ఫూర్తిచేఁ
గరమున్ శోభ వహింపఁ జేయుచువిహంగశ్రేణికుత్సాహముల్
బరగన్ జేసి కలస్వనంబు లొసరన్ బల్కింప నౌశక్తి నీ
కరుణం గాదె వసంతుఁ డొందెను నిరాకారాఖ్య సర్వేశ్వరా. 10

క. కమలాప్తుండు భవన్మహామహిమచే గాటంపులోకాంధకా
రముఁ బోఁగొట్టి పగళ్లు చేసెడిసమర్థత్వంబుఁ బొ్రిపించెఁగా
కుముదాప్తుండు భవన్మహత్త్వమున వెల్గుర్ గూర్చుచుర్ రాత్రులం
దముగాఁ జేయుసమర్థతం బొరసె మింటర్ నిల్చి సర్వేశ్వరా. 11

శా. నీయాజ్ఞం గనియే కదా జలధి దా నిత్యంబు ఘోషించువాఁ
డై యున్నర్ మఱి హద్దు మీఱఁడు లవం బైనర్ దదంతర్గతం
బాయాార్వాగ్నియు మీఁదికిర్ జనక లోనై వెల్గుచుండెర్ జగ
చ్ఛ్రియోదాతవు నీవె కావున నినుర్ సేవింతు సర్వేశ్వరా. 12

మ. లయకాలంబున నెల్లలోకములు వీ్రిలర్ సృష్టికర్తృత్వ మ
త్యయముం బొందఁగఁ బంచభూతములుతన్మాత్రింబులై యుండ స
వ్యయతేజోనిధి వైనసీ వొకఁడవే యాపై మహాజ్యోతి వీ
వయి యేకాకృతి నుందువో సకలలోకాధార సర్వేశ్వరా. 13

మ. సుగతిర్ గోరుచు రూపశూన్యుఁడ వటంచుర్ నిర్గుణోపాసకుల్
సగుణోపాసకు లైనవారలు సమంచద్రూపయుక్తుండ వీ
వగుచున్నా వనిసన్నుతించెదరు నీ వారీతి నెవ్వారిధ్యా
నగతం బెద్దియొ యద్దియే యగుచు నున్నావోయిసర్వేశ్వరా. 14

మ. చలి బాధించుట శీతకాలమున గీ్రిష్మంబందుఁ దీక్ష్ణాతపం
బులచే దుస్సహ మైనగొప్పవడగాడ్పుల్ లోకపీడాకరం
బులుగా నుండుట బావులందు సలిలంబుల్ దుర్లభం బౌట నీ
వలనర్ గాదె ఘటించుచున్నవి తలంపర్ దేవ సర్వేశ్వరా. 15

మ. నదులెల్లర్ జలరాశిఁ జేరుకొనుచందానర్ మనుష్యోత్తముల్
మది నేదేవతకై నమస్కృతులు నేమం బొప్పఁ గై వారముల్

గదియం జేయుదు రానమస్కృతులు నాకై వారముల్ నీకెయా
గదరా యెంతటివారు నిన్నుఁ దెలియంగా లేరు సర్వేశ్వరా. 1(

మ. మునులున్ యోగులు నిన్ను నెమ్మనమునన్ బొల్పొందఁగా నిల్పి ము
క్తినె తా మందఱుఁ గోరుచుండి గురుభక్తిశ్రద్ధలన్ నిత్యము
స్మ్రనధ్యానము లాచరించుచు మహానందానుసంధానశ
క్తిని గైకొందురు నీకృపామహిమఁ గాదే దేవ సర్వేశ్వరా. 17

మ. సుమముల్ గొన్ని ఘనంబులై* పరిమళించున్ గొన్ని సౌరభ్యశూ
న్యములై యుండును గొన్ని పండ్లు జనులానందింప మాధుర్యవం
తములై యుండును గొన్ని పండ్లు కటుతిక్తత్వామ్లతల్ బొందుస
ర్వము నీవై యిటు జేయుచుందు వనిసంభావింతు సర్వేశ్వరా. 18

మ. మనుజుం డొక్కఁడు బుద్ధిమంతుఁడయిసంభావించు నొప్పొందుచుం
డును వేరొక్కఁడు శుద్ధసాత్వికగుణుండున్ ధైర్యవంతుండునై
తనరున్ వేరొకరుండు కోపరసయుక్తస్వాంతుఁడై యుండుఁ గా
వున నిట్లాట భవద్విలాస మని నిన్ భూషింతు సర్వేశ్వరా. 19

మ. మును సద్భావులు పాండవుల్ వనములో భూరిశ్రమం బొంది దు
ర్జనుఁడైనట్టిసుయోధనున్ గెలిచి ధర్మం బేమియుం దప్పక
త్యనురాగంబున రాజ్య మేలిరి భవత్కారుణ్యసంప్రాప్తిచే
నిను వర్ణింపఁగ శక్యమే యెవరికేనిన్ దేవ సర్వేశ్వరా. 20

మ. రతనంపుంగమి కెన్నఁగా మనికియై రత్నాకరుం డున్నప
ద్ధతిగా నీవు సమస్తతేజములకున్ స్థానంబవై యుండి యు
చ్చతమస్ఫూర్తి జగంబు లెల్లను బ్రకాశంబొందఁగాఁ జేయుచుం
డితి వత్యద్భుత మైవిభాసిలుఁ గదా నీచర్య సర్వేశ్వరా. 21

మ. తనయుల్ దమ్ములు దల్లిదండ్రులునుభార్యల్ మున్నుగాఁగన్గవా
రిని గన్నంతనె ప్రేమనొందుచును సంప్రీతిన్ విలోకించుచుం
డును మర్త్యుం డికఁ దాను దొల్లిట నెవండో యిట్లుగా నేలఁబు
ట్టెనో లేశం బెఱుఁగండు నీమహిమ వాటిల్లంగ సర్వేశ్వరా. 22

శా. కాకం బార్చుట కప్పగూయుటయుఁజిల్కల్ చక్కఁగాఁబల్కుటల్
కేకుల్ కేకలు వేయుటల్ ద్విరదముల్ ఘీంకారముల్ సేయుటల్
వీఁకన్ సింహము బొబ్బరించుటయుఁ బృథ్విన్ వీనిభేదస్వర
స్వీకారంబుల కెల్లఁ గారణమ వీవే యౌదు సర్వేశ్వరా. 23

శా. నీలం బై యతినిర్మలం బయి ప్రభానీకంబుతోఁ దారకా
జాలంబుల్ గ్రహమండలంబులు విభాస్వచ్ఛింశుమారాశ్రియు
ప్రాలంబంబున నిల్వఁ దేజరిలునభ్రం బెంతయున్ నీమహా
లీలం దెల్పుచునుండె నెల్లజగము ల్మెచ్చంగ సర్వేశ్వరా. 24

మ. యముఁ డెల్లప్పుడు ప్రాణికోటి కగుధర్మాధర్మముల్ వేర్పఱిం
చుమహత్త్వంబును బూనుచుండుట పయస్తోయప్రభేదప్రకా
రము హంసంబు వహించుచుండుటయు నీరాజత్ప్రభావంబుచే
నమరెన్ గా కెటుగల్గు సర్వభువనౌఘాపూర్ణ సర్వేశ్వరా. 25

మ. పురుహూతుండునుమున్నుగాఁ గలుగువేల్పుల్ స్వర్గలోకంబునన్
గరముల్ గాంతలతోడఁ గూడుకొనిభోగంబుల్ రహింబొందుచుం
దురు నీమాయ గడల్కొనంగనె కదా దుర్మోహులై రందఱున్
బరతత్త్వంబవు ని న్నెఱుంగరు పరబ్రహ్మంబ సర్వేశ్వరా. 26

మ. అల యాదిత్యమయూఖజాలములయం దత్యుష్ణతావాప్తియున్
జలజాతారికరాళియం దతులమౌ శైత్యంబునుం గూర్చి లో

కులకుఁ సౌఖ్యముఁ గల్గఁజేసితివి నీకుఁ బ్రొక్కెదన్ నిత్యముక్
దలమూ నాకు నిన్నుఁ నుతింప సకలాంతర్యామి సర్వేశ్వరా. 27

మ. చెఱకుంబానకమందుఁ గొందఱికి సుక్షీరంబులం దెన్నఁ గొం
దఱికిన్ మాక్షికమందుఁ గొందఱికి సద్ద్రాక్షాఫలంబందుఁ గొం
దఱికిన్ జిహ్వలు వేఱుగా నగుటఁ గాదా తద్రుచుల్ వేఱుగా
నెఱుఁగన్ జేసితి వొక్కటైననగునే యీక్షింప సర్వేశ్వరా.28

మ. యమునాశైవలినీజలంబులకు నైల్యం బొందఁగాఁ జేసి యా
సుమనశ్శైవలినీజలంబుల కొగిన్ శుభ్రత్వముం గూర్చి యే
కముగా రెండుప్రవాహముల్ నడపి లోకంబుం బవిత్రంబుఁ జే
యుమహాత్ముండవు నీవ కావె మదిలో నూహింప సర్వేశ్వరా. 29

శా. భృంగశ్రేణులు పద్మమధ్యగతమాధ్వీకంబులం గ్రోలుఁ జ
క్రాంగంబుల్ మఱి తమ్మితూండ్లు దిను నిట్లాహారమేర్పాటుసే
యఁగా నయ్యది యేకవస్తుజనితం బైనన్ శరీరంబునన్
రంగుల్ వీనికి వేఱు లౌట యిది చిత్రం బయ్యె సర్వేశ్వరా.30

శా. నీటం బుట్టుచు నీటిలో మెలఁగుచున్ నీరంబులే గ్రోలుచున్
మీా కూర్మాలతెఱంగుఁ జూచిన నొగిన్ మేఘంబునం బుట్టి నా
నాటం బాటిలునింద్రగోపములచందంబున్ విలోకించినన్
నూటిన్ నీ వొనరించుసృష్టి యరుదై శోభిల్లె సర్వేశ్వరా. 31

శా. గోవుల్ వత్సలఁ గన్నయంతటనె కన్గొంచున్ దృఢం బైనప్రే
మావిష్కారము గాఁగ వానిమెయి జిహ్వాగ్రంబుతో నాకుచున్
బ్రోవంజూచుచు క్షీరముల్ గుడిపి యంబోయంచు వెన్ వెంటరాఁ
బోవుం గావున నీవిలాస మిదియై పొల్పొందు సర్వేశ్వరా. 32

శా. పూరిఁ మేయుచుఁ గానలోఁ దిరిగి పెంపుం గాంచు చున్నట్టివి
స్తారోదారమృగాళికైన ఘనసౌధంబందు వర్తించు సు
శ్రీరాజన్యులకైనఁ గాని యెపుడున్ క్షేమంబులం గూర్ప నా
ధారంబైతివి నీవె యంచు నిను నాత్మం గొల్తు సర్వేశ్వరా. 33

శా. భూమిన్ విత్తనముల్ మనుష్యుఁ డిడినన్ మొల్పించితద్రక్షకై
యామింఁదన్ జలవృష్టులం జొనిపి సస్యాదుల్ ఫలింపించి లో
కామోదం బొనఁగూర్చుచుంటి విటు లత్యంతానుకూలుండ వై
నీమాహాత్మ్యముఁ బేర్కొనంగ దరమౌనే మాకు సర్వేశ్వరా.34

శా. వీఁకం బొల్చునిశాటులన్ దునిమి యుర్వీభారమున్ మాన్పి య
స్తోకంబైనకృపారసంబున జనస్తోమంబులం బ్రోవ నీ
వే కావే యఖిలావతారముల తీవిం బూనినా వందుచే
నీకన్నన్ మఱి రక్షకుల్ వెదకిన న్లేరింక సర్వేశ్వరా. 35

శా. స్థూలోపాధి నెసంగుహస్తులకు శక్తుల్ గొప్పవై యుండె న
స్థూలోపాధిని బొల్చుదోమలకు శక్తుల్ సైకమైయుండె ని
శ్లేలా చేతన మొక్కటైనను బలం బీరీతిగా నుండుటల్
నీలీలావిధ మిట్టిదే యని మదిన్ నే నెంతు సర్వేశ్వరా. 36

మ. అల దుష్టాళి నణంచఁగన్ బ్రతియుగంబందున్ మహాసాధుస
త్కులమం దుద్భవ మొంది శిష్టులవిపత్తుల్ బాయఁగాఁ దోలివా
రలసంరక్షణ మాచరించుచు నవార్యప్రేమచే నీవు భ
క్తులఁ బోషించుటకై రహిన్ బిరుదు గైకొన్నావుసర్వేశ్వరా.37

శా. నానాదేహములందు నీ వమరుటన్ నామంబులున్ రూపముల్
లోనై యున్నవి నీకుఁ గల్గె నవి యాలోచింపఁగా స్వచ్ఛ మౌ

పానీయం బొక్కటైన వేఱు లగుభూభాగంబులం దుండుటన్
దానిన్ వర్ణరుచుల్ పృథక్కు లగుచందం బొప్ప సర్వేశ్వరా.38

మ. దురితాత్ముల్ రచియించుపాపములయందుం దారతమ్యంబులం
బరిశీలించి తదర్హశిక్షల విధింపన్ దక్షిణాధీశునిన్
నరకంబం దధికారిఁ జేసితివి గానన్ ధర్మముం గాంచు నే
ర్పరయంగా నతఁ డొందె నీమహిమచే నోఁ గాదె సర్వేశ్వరా.39

శా. వాణీనాథుఁడు సత్యలోకమునకున్ వాల్లభ్యముం బూని స
ద్వీణానాదవినోదముల్ గనుచుఁ బ్రీతిన్ మానులున్ దేవతా
శ్రేణుల్ దన్నొగి నోలగింప సభలో సింహాసనాసీనుఁడై
రాణింపం దగియుంట నీకరుణచేఁ బ్రాపించె సర్వేశ్వరా. 40

మ. అమరాధీశుఁడు సర్వసంపదలతా వై స్వర్గలోకాధికా
రముఁ గావించుచుఁ బ్రాణికోటిసుకృతవ్రాతంబుచే నైనభో
గము లొందించుచుఁ దన్ను వేలుపులమూఁకల్ గ్రేవలం గొల్వఁగా
నమరెన్ నీ వొసరించుచుంటనె కదా యట్లాట సర్వేశ్వరా.41

శా. నీతేజంబె సమస్తప్రాణితతికిన్ నేత్రంబులం దుండి వి
ఖ్యాతం బైనప్రపంచ మెల్లను గనంగాఁ జేయుచుండెం గదా
నీతత్వం బది యెట్టిదో యెవరికేనిన్ గానరాకుండుటన్
ధ్యాతల్ నిన్ను నివాతదేశగతులై ధ్యానింత్రు సర్వేశ్వరా. 42

మ. కకుబంతంబుల నుండి దిక్పతులు దిక్కాండంబు నీక్షించినీ
దుకటాక్షంబున నేలుచుండిరి సముద్రుండుం బయోజంతురా
శికి సంరక్షకుఁ డౌచు వానిని స్వకుక్షిం బూనుచుండెన్ భవ
త్సుకృపావాప్తినె యట్టిశక్తులు వహింతు ర్వారు సర్వేశ్వరా. 43

మ. అలయంభోధి మథించువేళ నుదయం బైనట్టిహాలాహలం
బిలపైఁ బర్వి విపత్కరం బగుచు బిట్టేర్చంగ నీ వప్డు నే
ర్పలరన్ దానిని మ్రింగి లోకసముదాయంబున్ గడుం బ్రోచితోఁ
దెలియంజాలను నీమహత్తు నిను భక్తిం గొల్తు సర్వేశ్వరా. 44

మ. అనలుం డెల్లపుడున్ భవన్మహిమచే నైనట్టితేజంబుఁ గై
కొని భాసిల్లుచు శీతకాలమునఁ గార్కొన్నట్టియాశీతబా
ధను బోఁగొట్టుచు నెల్లవారలకు నత్యంతోపయుక్తుండుగా
నొనరెన్ నీవె ప్రపంచరక్షకుఁడ వై యున్నావు సర్వేశ్వరా. 45

శా. ఏకాలంబున నెద్ది యెట్టు లగునో యెవ్వారికేన్ శక్యమే
వాక్రువ్వన్ నరుఁ డొక్కకార్య మొనరింపంబూన వేఱొక్కటై
చేకూరం దగుచుండుఁ గావున దయాసింధుండ వౌనీవె ప్ర
జ్ఞాకౌశల్యముచేతఁ గూర్తు వటులన్ సర్వంబు సర్వేశ్వరా. 46

మ. పరుసం బంటినతోడనే యినుము మొగిన్ బంగార మౌరీతి నీ
కరుణాదృష్టి యొకింతయైనఁ గదియంగా నెట్టిమూఢాత్ముఁడున్
బరమజ్ఞానసమన్వితుం డగుచు నిన్ భావించుచుండున్ నిరం
తరమున్ దీనశరణ్య ఘోరదురితధ్వాంతార్క సర్వేశ్వరా. 47

మ. పదునాల్గైనజగంబులం బరగునీబ్రహ్మాండమున్ నీవు నీ
యుదరంబందు భరించుచుంటివి మహాయోగీశ్వరుల్ గాని నీ
పదమున్ గానఁగ లేర దెట్టిదియొ యెబ్భంగిన్ విభాసిల్లుచు
న్నదొ నే నెట్టు లెఱుంగఁజాలుదు ననంతా దేవ సర్వేశ్వరా. 48

శా. భూమీపాలుఁడు నీస్వరూపముననే పొల్పొందఁగా నుద్భవం
బై మాతంగతురంగవాహనశతాంగానీకసంపన్నుఁ డై

నీమాహాత్మ్యముచేతనే ఖలుల దండింపన్ సమర్థుండ వో
స్వామీ నీదయ గల్గినన్ సకలమున్ సంధిల్లు సర్వేశ్వరా. 49

మ. పలుకుల్ వేయి వచింప నేటికిఁ బరబ్రహ్మంబ వీ వెల్లప్రా
ణులకున్ వానిహృదంతరాళములయందున్ నిల్చి జ్ఞానస్మృతుల్
గలుగన్ జేయుచు నుండి వానికి నహంకారం బొనంగూర్చి మో
హాలతం బన్నితి వైంద్రజాలికునివిద్యంబోలె సర్వేశ్వరా. 50

ఉపదేశము.

మ. అరిషడ్వర్గము గెల్చి పిమ్మట ముముక్షాన్వితుఁడై యుండి భో
గరతిన్ వీడి శమాదికంబు లగుషట్కం బొంది జీవాత్మకుం
బరమాత్మైక్య మొనర్పఁ బూని మదిలో భావించినన్ ముక్తి చే
కురు నంచున్ వచియింతు సంసృతివిముక్తున్ జేయు సర్వేశ్వరా.51

మ. బ్రతుకున్ నమ్ముచు బుద్బుదప్రతిమమై వర్తిల్లుదేహంబె శా
శ్వతికం బంచును మూఢులెల్లఁ బరతత్త్వజ్ఞాన మొక్కింతయున్
మతిఁ దర్కింపక దుష్టతం బొరసి దుర్మార్గక్రియల్ సేయఁగా
జతనంబున్ రచియింపుచుందురు దురాశాసక్తి సర్వేశ్వరా. 52

మ. తొలి బాల్యంబున బాలురం గదిసి యెంతో సంతసం బొంది యా
టల నాడున్ మఱి యౌవనం బుదయమౌటన్ స్త్రీరతుండై ప్రవ
ర్తిలు నానాటికి వార్ధకం బొనరఁగా దేహంబునందున్ వళీ
పలితంబుల్ గని కుందు నిన్ దెలియఁ డెవ్వండైన సర్వేశ్వరా.53

మ. ధన మొక్కింతయుఁ గల్గెనేనిఁ గడు మోదంబొందుచున్ భక్ష్యముల్
మునుగానైనవి మెక్కి కాయముఁ గరంబుం బెంచి మత్తిల్లి దు

ర్జనసంసర్గ మొనర్చి యాపిదప దుష్కార్యంబులన్ జేయఁబూ
నును మర్త్యుండు మదిం దలంపఁడు శరణ్యున్ నిన్ను సర్వేశ్వరా.54

మ. జననం బొందుట గిట్టుచుండుట పునర్జన్మంబులం బొందుటల్
తనపూర్వార్జిత మైనకర్మఫలముల్ దా నిష్టు భోగించుటల్
దనకుం దప్పకయుండుఁ గాన నిను నాత్మన్ నిల్పి ధ్యానించునా
తనికిన్ సంసృతిబంధమెల్లఁ దొలఁగున్ దర్కింప సర్వేశ్వరా.55

మ. ఒకఁ డత్యంతధనాన్వితుం డగుట వేఱొక్కండు దరిద్రుఁడై
దక దారిద్ర్యసమన్వితుం డగుటయుం దర్కింపఁగా వానిపూ
ర్వకృతంబై తగు కర్మరాజిఫలమే ప్రాప్తించి వర్తించె నఁ
టకు లక్ష్యం బగుచుండె సజ్జనశరణ్యా దేవ సర్వేశ్వరా. 56

మ. దయయున్ సత్య మహింసయుం గలిగి తత్త్వజ్ఞుండునై యింద్రియ
ప్రియసంవర్జన మాచరించుచు నవిద్యాత్యాగముం జేసి శాం
తియుతుండై మఱి సర్వభూతసమబుద్ధిం బూని నీయందు భ
క్తి యొకింతైనను గల్గుమానవుఁడు ముక్తిం గాంచుసర్వేశ్వరా.

మ. కనకంబందును లోష్టమందును సమాకారంబుగాఁ జూచుచున్
దను నిందించిన సన్నుతించిన సమానస్ఫూర్తి నాలించుచున్
ధనశాలిత్వ దరిద్రితానుగతుల న్మానావమానంబులన్
దనరన్ దుల్యతనొందువాఁ డగు సదానందుండు సర్వేశ్వరా. 58

మ. జలజంబుల్ రవికాంతి బర్విన వికాసం బొందుచున్నట్టు లు
త్పలముల్ చంద్రునికాంతి సోఁక వికచత్వం బొందుచందంబుగన్
వెలయంగా నిను నమ్మి కొల్చినతపస్విశ్రేష్ఠులున్ నీకృపా
కలనన్ మోక్షము నొందుచుందురు విరాగప్రాప్య సర్వేశ్వర

శా. భోగాసక్తులు గర్వసంయుతులు కోపుల్ దుష్క్రియాస్తోమసం
యోగాత్యంతపరాయణుల్ కలితమోహుల్ సత్యభాషాపరి
త్యాగుల్ భక్తివిహీనులున్ నిను మదిన్ ధ్యానింపఁగాలేక దు
ష్ప్రాగల్భ్యకరులై నటించెదరు పాపధ్వంస సర్వేశ్వరా. 60

మ. జనుఁ డెవ్వేళల ధర్మవర్తి యగుచున్ సత్యంబు భాషింపఁగా
జనునాతండు శుభంబు లొందును హరిశ్చంద్రుండు సత్యంబుఁ ద
ప్పనివాఁడై తనయాపదల్ దొలఁగి పూర్వంబట్లుగా రాజ్యపా
లనముం జేసి యశంబు నొందె సురలెల్లన్ మెచ్చ సర్వేశ్వరా.

మ. పరపత్నీగమనం బొనర్చిన మహాబాధాసహాక్రాంతుఁడై
దొరలున్ గౌతమపత్నిఁ గూడి సురనాథుం డంగవైకల్యముం
బొరసెన్ దన్మునిశాపకారణమునం బొల్పైనశీతాంశుఁడున్
గురుపత్నీగమనం బొనర్చి సకళంకుం డయ్యె సర్వేశ్వరా. 62

మ. జలరాశిం బ్రభవించి పోవుతరగల్ చందంబునం గల్మిలే
ములు మర్త్యాళికిఁ గల్గుచుండును సుఖంబుల్ దుఃఖముల్ గూడ న
ట్టులనే కల్గును దా నెఱుంగఁడు విమూఢుం డెప్పుడున్ నీదుమా
యలు గ్రమ్మంగను సర్వలోకపరిరక్షాసక్త సర్వేశ్వరా. 63

మ. ధనవంతుం డగుమానవుండు పెలుచన్ దట్టంబుగాఁ గూడఁబె
ట్టిన యాద్రవ్యముఁ దా భుజింపక యొకండేన్ గోరినన్ వాని కీ
యనివాఁడై కడులోభియైన నదియన్యాధీనమై పోవుచుం
డును దానన్ సుఖ మేమియుం గనఁడు దుష్టుండౌను సర్వేశ్వరా.

మ. ధన మార్జించెడిచో శ్రమం బెనసి లబ్ధంబైనయావిత్తముం
గొని తద్రక్షణముం బొనర్చుటకుఁ బెక్కుల్ గానుపాయంబులున్

మనుజుం డెన్నును దానిఁ జోరులు హరింపన్ దుర్వ్యథాక్రాంతుఁడై
తనరున్ నిర్ధనుఁడైనవాఁడె యగుపో ధన్యుండు సర్వేశ్వరా.65

మ. మనుజుం డుద్భవ మైనతోడుతనె కామక్రోధలోభాదులున్
జననం బొందునసంతరం బతని కాశాపాశముల్ మానసం
బునఁ జుట్టంగను బీఁచుకాయపురుగుంబోలెన్ నిబద్ధాత్ముఁడై
పోనరున్ నిస్పృహుఁడైనవాఁడెసుఖమైపొల్పొందు సర్వేశ్వరా.66

మ. వలరా జొక్కఁడు కామినీవరులపై వ్యాపించుచున్ మోహముం
గలుగన్ జేయు నటంచు లోకములు వక్కాణించు నట్లైనచో
వెల్లయంగా నతఁ డట్టిశక్తిఁ గన నీవే కారణం బంచు నేఁ
దలఁతున్ డెందమునందు భక్తజనబృందత్రాత సర్వేశ్వరా.67

మ. తనకున్ స్వర్భువనాధిపత్య మది లబ్ధం [illegible]
ర్తనముం బొందవు సంతతంబును రహిన్ [illegible] నపత్[illegible]
డను గ్రీడించినమోహ మేమియును [illegible] నే [illegible]
నిను డెందంబున గొల్చి ముక్తిపదవిన్ [illegible] సర్వేశ్వ[illegible]8

మ. అతిసౌఖ్యంబును మేను గోరు నిఁక జి[illegible] గోర[illegible]
సితసౌరభ్యము నాస గోరు మఱి యక్షి[illegible]ద్వయమున్ [illegible]సుం[illegible]
కృతి నీక్షింపఁగఁ గోరుఁ గర్ణములు సద్గీ[illegible]నం గోరు
న్నుతపంచేంద్రియముల్ జయింపఁగఁ దగ[illegible]రా.

మ. పులుగుల్ స్వోదరపోషణార్థము వనంబుల్ సొచ్చి [illegible]యల్ ఫలం
బులు భక్షించి క్షుధానివారణము నేర్పుల్ మీరఁగాఁ జేసికోఁ
గలిగెన్ గాన స్వకుక్షిపోషణము లెక్కౌ తా ననేకప్రజా
దులఁ బోషించినవాఁడె యుత్తమగృహస్థుండెన్న సర్వేశ్వరా.70

శా. దారిం బోవుచు నున్నపాంథులకు సత్రంబుల్ వినిర్మించి యా
హారంబుల్ సమకూర్చువారలును నీరాగారముల్ నిల్పి పా
ల్వారంగన్ మధురోదకంబు లిడఁగా నౌవారు నెన్నంగ నీ
కారుణ్యంబునఁ గాంచుచుండ్రు శుభసంఘాతంబు సర్వేశ్వరా. 71

మ. నిను డెందంబున నిల్పి కొల్చినను వానిన్ బాపముల్ పొందకుం
డును సర్వాపదలుం దొలంగు శుభసందోహంబు ప్రాపించుచుం
డును మోక్షంబున కెన్నఁ బాత్రుఁడగుచుండున్ గాన నిన్ వేఁడుకొం
చును చిత్తంబున నిల్పి కొల్తు నెపుడున్ శుద్ధాజ సర్వేశ్వరా. 72

శా. ఈసంసారసముద్ర మెంతగలదో యీదంగ శక్యంబుగా
దాసల్ దీరవు మేరలేక మిగులన్ వ్యాపించుచుండున్ వృథా
యాసంబుం గనుచుండ్రు దేహులు స్వకర్మావాప్తవిత్తంబుతో
నే సంతుష్టిని బొందువాఁడు సుఖి యా నెల్లప్డు సర్వేశ్వరా. 73

శా. వాదంబుల్ రచియింపఁ గూడ దది యెవ్వారైన శాస్త్రంబులన్
మోదం బొప్పఁ బఠించియైన గురువుల్ బుద్ధాత్ము లౌవార లెం
తే దర్శించినమార్గముం దెలిసి భక్తిశ్రద్ధతో దానియం
దే దృష్టిన్ నిలువంగఁ జేసినను ముక్తిం బొందు సర్వేశ్వరా. 74

శా. బోధం బుద్భవ మైనతోడనె మదంబున్ లోభమోహంబులున్
గ్రోధాదుల్ నశియించు శాంతతయుఁ జేకూరున్ సదా సత్యని
ష్ఠాధర్మంబులు గల్గు సర్వసమతాసంసిద్ధుఁడై యప్డు చే
తోధైర్యంబున నిన్ను గొల్చునతఁ డొందున్ ముక్తి సర్వేశ్వరా.

మ. తనగేహం బిది యంచు నియ్యది నిజద్రవ్యం బటంచున్ మదిన్
దనవారుం బరివా రటంచును విభేదంబున్ నరుం డొందెడున్

దన దైయుండెడివస్తు వొక్కటియున్నైనన్ లేదు చర్చింపఁగన్
దనమేనే తన కుండి తక్కుదు గదా దైవంబ సర్వేశ్వరా. 76

మ. మృగజాలంబు మరీచికాసముదయం బీక్షించి నీరంబులం
చొగి విభ్రాంతిని బొందినట్లుగను దేహాల్ దారపుత్రాదులం
దగ వీక్షించుచు నస్మదీయులని లోనన్ భ్రాంతు లౌచుండ్రు నీ
దగువాత్సల్యము గల్గనేని దొలఁగు మోహంబెల్లసర్వేశ్వరా.77

మ. తనదేహంబున రోగముల్ వొడమి బాధల్ సేయఁగాఁగాలయా
పన గొంతయ్యెడు దారసంగమసుఖవ్యాపారసంసక్తిచే
తను నశ్లేఁగును గొంతకాల మిఁక నిద్రిం గొంతకాలం బొగిన్
జనుచుండుం గుజనుండు నిన్ను నెఱుఁగం జాలఁడుసర్వేశ్వరా.78

మ. తనకున్ సంపదగల్గినప్పుడె సమస్తం బైనభోగంబులన్
గనుచున్ బిమ్మట నర్థికోటికి స్వశక్త్యానుసారంబుగా
ధన మర్పించి వివేకశాలి పరతత్వజ్ఞానచింతాపరా
యణుఁడై నిన్ను మదిన్ భజించు శ్రుతివాక్యజ్ఞేయసర్వేశ్వరా.

మ. చదువుల్ నేర్చినవారికే యగు ప్రపంచజ్ఞానసంసిద్ధి భూ
తదయాదుల్ సదసద్వివేకమును తత్వధ్యానసంప్రాప్తియున్
బొదలున్ మర్త్యుఁడుశాస్త్రముల్ చదివితద్బోధంబుఁగాంచంగఁగో
విదుఁడై పిమ్మట మోక్షముం బొరయు సంవిద్వేద్యసర్వేశ్వరా.

మ. అనృతం బాడినవాఁడు పాపములచే నాక్రాంతుఁడై నారకం
బున ఘోరం బగుబాధలం బడ నగున్ మున్ ధర్మరాజంతవాఁ
డును గొంచెం బనృతంబుఁ బల్కుటనుదుష్టుల్ వొందునన్నారకం
బును దాఁ జూడక తీరదయ్యెఁ గరుణాంభోరాశి సర్వేశ్వరా. 81

మ. పరపత్నిన్ రమియింపఁగాఁ దలఁచెనేన్ స్వప్రాణహానిన్ వెసం
బొరయున్ సింహబలుండు ద్రౌపదిపయిన్ మోహించి తొల్లిన్ వృకో
దరుచేఁ దానును సోదరుల్ మడిసి రుద్దండప్రచండాహతుల్
గరమున్ మేనునఁ దాఁకి భక్తజనరక్షాదక్ష సర్వేశ్వరా. 82

మ. పరనిందం బొనరింపకుండి విషయవ్యాసక్తతన్ మాని ని
ర్భరతృష్ణన్ విడనాడి సత్యనియమప్రాప్తిం బ్రవర్తించి నీ
స్మరణధ్యానము లాచరించుచుఁ దపశ్చర్యావిధిం దీర్చి దు
స్తరమోహాంబుధిఁ దాఁటెనే నతఁడు మోక్షంబొందు సర్వేశ్వరా.

మ. దురితాత్ముల్ రచియించుకృత్యములు సాధుశ్రేణికిన్ గష్టముం
బరగించుం దొలుతన్ మునీంద్రుఁ డగువిశ్వామిత్రుజన్నంబునన్
బొరి మారీచసుబాహుదైత్యకులజుల్ బుత్తెంచి రక్తంబునన్
దరిసంబుం బడవేయ బాధలు తటస్థం బయ్యె సర్వేశ్వరా. 84

మ. కులవిద్యాభ్యసనం బొనర్చి గురుభక్తుండై సదా బ్రహ్మవా
దులతో స్నేహ మొనర్చుచుండి పరవస్తుజ్ఞానముం బొంది ని
శ్చలు నస్తేయ మహింసయుం గలిగి విష్వగ్వ్యాప్తతేజస్సము
జ్జ్వలు నిన్నున్ భజియించువాఁ డెనయుఁ గైవల్యంబు సర్వేశ్వరా.

మ. అల సౌదామనిపోలెఁ జంచలము దేహం బంచునూహించి ని
శ్చలచిత్తంబున నిన్ను నిల్పుచు నజస్రంబున్ భవద్ధ్యానమే
యెలమిం జేయుచునున్న మానవుఁడు దా నీలోకమందున్ సుఖం
బులఁ బ్రాపించి యనంతరంబునఁ గనున్ మోక్షంబు సర్వేశ్వరా.

మ. నిను సేవించినవాఁడు సర్వశుభముల్ నెక్కొంచు నుండున్ సదా
నిను భక్తిన్ నుతియించువాఁడు దురితానీకప్రముక్తుం డగున్

నిను ధ్యానించినవాఁడు సద్గతిఁ గనున్ నీవే సమస్తంబు మా
కొనఁగూర్పం దగువాఁడ వంచు మదిలో నూహింతు సర్వేశ్వరా.

## ప్రార్థన.

శా. మన్నొక్కండె యనేకభాండములుగా మారైనచందంబుగా
హేమం బొక్కండె యనేకభూషణములై యున్నట్టిచెల్వొందఁగా
నెన్నన్ నీ వొకరుండవే బహువపుర్బృందప్రవిష్టుండ వై
యున్నావంచు నినున్ దలంతు మదిలో నుప్పొంగి సర్వేశ్వరా. 88

మ. అణువౌవస్తువుకంటె సత్యణువ వై యంచన్మహారూపజృం
భణ మౌవస్తువుకంటె నత్యురుతమభ్రాజిష్ణురూపంబ వై
గణుతింపం దగియున్న ని న్నెటుల నేఁ గాంతున్ యథాశక్తిగాఁ
బ్రణుతింతున్ నిను డెందమం దనిశమున్ రక్షించు సర్వేశ్వరా.

మ. ఫలముం గోరుచు యాగముల్ సలిపి యజ్వల్ స్వర్గభోగంబులిం
పలరం బొందుదు రద్ది గోరను భవద్ధ్యానంబుఁ గావించుజ్ఞా
నులు మోక్షంబును బొందుచుందు రది నేనుం గోరుచున్ నిన్ను ని
శ్చలచిత్తంబున నిల్పి కొల్చెదను భాస్వద్ధామ సర్వేశ్వరా. 90

శా. నీ వొక్కండవె సర్వలోకములకున్ నిర్మాత వై వాని నెం
తేవాత్సల్యముతోడఁ బ్రోచుటకు సద్దీక్షన్ దగం బూనియు
న్నా వెల్లప్పుడు నెల్లచోటులను నిండన్ నిల్చి నీభక్తుఁడన్
గైవల్యంబు నొసంగు మయ్య దిదె నేఁ గాంక్షింతు సర్వేశ్వరా.

మ. మును ప్రహ్లాదుఁడు వొందుకొందలములం బోఁగొట్టి తత్ప్రదక్షణం
బును గావించి దయావలోకనముచే మోక్షంబు నీ విచ్చినా

వని నీసత్కథ లెల్లలోకమున నే నాలించితింగాన నీ
న్ననుమానింపక గొల్చెదన్ మనుపు మయ్యా నన్నుసర్వేశ్వరా.

శా. నే నేదేశమునందు నుండినను నిన్నే నెమ్మదిన్ నమ్మితిన్
వీనుల్ నీచరితంబులే నిరతమున్ వించుండఁగాఁ గోరె నీ
వే నిత్యుండవు నక్షరుండ వని సేవింతున్ సదా భక్తితో
దీనత్రాణపరాయణా మనుపుమా దీవించి సర్వేశ్వరా. 93

మ. నినుఁ బాంచాలి సభాంతరంబునను దండ్రి లోకనాథా దయా
వనధీ బ్రోవు మనంగ విస్తృతము లౌవస్త్రంబులన్ నీవు క
ల్పనగావించి తదీయమానమును లీలం బ్రోచినా వందుచే
తను నిన్నార్త శరణ్యుఁగాఁ దలఁతుఁ జిత్తంబందు సర్వేశ్వరా.94

మ. బహుపుణ్యంబులు గోరలేదు విపులైశ్వర్యంబులుం గోరలే
దిహసౌఖ్యంబును గోరలేదు మదిలో నెల్లప్పుడున్ నీయను
గ్రహమే గోరుచు నీదుసన్నుతి నొనర్పంబూని యున్నాఁడ ను
త్సహమొప్పన్ నను బ్రోవుమయ్య సకలాశాదాయిసర్వేశ్వరా.

మ. మదినెల్లప్పుడు నిన్నుఁ గొల్చుచును నీమాహాత్మ్యమున్ సన్నుతిం
చెద నీభక్తుఁడ నై ప్రపత్తి మెయి నిన్ సేవింపఁగాఁ గోరుచుం
డెద నాయందు ననుగ్రహించి శుభదృష్టింజూచుచుంబ్రోవుమా
సదయాలోకన లోకరక్షణ సమంచద్దీక్ష సర్వేశ్వరా. 96

మ. ఘనసౌధాంతరశాయినైనను తుత్రిటత్కట్వంబునం బవ్వళిం
చిన నిద్రాసుఖ మొందు పడ్రసములన్ జెన్నొందుశాల్యోదనం
బును భక్షించినఁ గానలోఁ గలఫలంబుల్ మెక్కినన్ క్షుత్పిపాసాం
తిని బొందున్ విభవం బిఁకేల నను నెంతే బ్రోవు సర్వేశ్వరా.97

అనుతాపము.

మ. తనకుఁ విత్తము గల్గి యున్నపుడె మిత్రశ్రేష్ఠులుఁ బంధులుఁ
దనసామీప్యముఁ జేరుచుందు రది శూన్యం బైనచో నొక్కఁడై
నను దన్నుం గదియంగ రాఁడు జలవంతం బైనవేళం గొలం
కునఁ బక్ష్యాదులు జేరినట్లుగను గన్గో నయ్యె సర్వేశ్వరా. 98

గోష్ఠ్యుద్దుష్యప్రార్థన.

శా. నీ వెచ్చోటవసించినావొ యనుచుఁ నిఁ జూడఁగా మర్త్యులెం
తేవిశ్వాసముతో శ్రమం బెనయుచుఁ దివ్యాలయంబుల్ మహా
గ్రావాగ్రంబులు పుణ్యభూములును దీర్ఘక్షేత్రముల్ జేరి రో
దేవా వారిహృదంతరాళములయందే యుంటి సర్వేశ్వరా. 99

మ. నిపుణుల్ గొందఱు మంత్రముల్ పలుకుచుఁ నిష్ఠాగరిష్ఠాత్ములై
జపముల్ సేయఁగ నందుచేతఁ దమకుఁ జ్ఞానోదయం బౌనటం
చెపుడుఁ మౌనము నొందియుంద్రు సరియా నెవ్వారికిఁ జూడనీ
కృపచే జ్ఞానము గల్గునంచు మదిలోఁ గీర్తింతు సర్వేశ్వరా.100

మంగళము.

శా. స్వామీ మంగళ మార్యసన్నుతజగత్ప్రాణప్రదా మంగళం
బౌ మీ కుజ్జ్వలతేజ మంగళము భక్తాపాదిసన్మంగళ
స్తోమా మంగళమయ్య మౌనిపటలీతోష్టూయమానప్రభా
భూమా మంగళమయ్య మీకు సతతంబుఁ దేవసర్వేశ్వరా.101

కవివిషయము.

మ. భువిలో నల్లమరాజవంశకలశాంభోరాశిపూర్ణేందుఁ డా
ర్యవరశ్లాఘితసచ్చరిత్రుఁ డగుసుబ్రహ్మణ్యసంజ్ఞాకస

త్కవికిఁ జిన్నమకుఁ సుతుండ నమరంగఁ రంగశాయ్యాఖ్యనే
కవి నే నీశతకంబు నీ కొసఁగితిఁ గైకొమ్ము సర్వేశ్వరా. 102

మ. ధరణీమండలి శాలివాహనశకాబ్దంబుల్ సముద్రాగ్నికుం
జరశీతాంశులచే గణింపఁబడఁగఁ జంచత్పరీధావిప
త్సరమందుం దగుమాఖశుద్ధప్రతిపద్ఘస్రంబునన్ బూర్తి యై
పరగెన్ నీశతకంబు సర్వభువనవ్యాప్తాజ సర్వేశ్వరా. 103

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

సర్వేశ్వరార్పణమస్తు.

